శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౩. | తారణ చైత్ర-కార్తికములు. | సంచిక ౧—౪



కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

1944

# విషయసూచిక.





శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౨౩. { తారణ చైత్ర-వైశాఖమాసములు. } సంచిక [illegible]


## స్వవిషయము

తారణసంవత్సరముతోఁ బరిషత్పత్త్రికకు నిరువదిమూఁడవసంపుటము ప్రారంభింపఁబడుచున్నది. యుద్ధపరిస్థితులవలనను, పత్త్రికాప్రకటనమును గూర్చి ప్రభుత్వమువారు ప్రకటించుచున్న యుత్తరువులవలనను పత్త్రికను బూర్వమువలె హెచ్చుపుటలతోఁ బ్రకటించుటకు వీలు కలుగనందులకుఁ బాఠకులు క్షమింతురుగాక. ఆయుత్తరువులు మార్పు చేయఁబడినతోడనే యథాప్రకారముగఁ బత్త్రిక ప్రకటింపఁబడు నని మనవి చేసికొనుచున్నాము.

ఇటీవల సారస్వతప్రపంచమునఁ గలుగుచున్న మార్పు లత్యధికముగ నున్నవి. నవలలు, చిన్నకథలు, ఖండకావ్యములు నెక్కువగఁ బ్రచారమును గాంచుచున్నవి. ప్రాచీనగ్రంథములరీతిని మునిత్రయచరిత్రము, అష్టావక్రచరిత్రము మొదలగు ప్రబంధములును విరళముగఁ బ్రకటింపఁబడుచున్నవి. నవలలయందును, కథలయందును నుపయోగింపఁబడుచున్న భాష నేఁటికిని నియమరహితముగ స్వచ్ఛందమార్గములఁ జరుచుండుట కడు శోచనీయము. కాలక్రమమున సుసంస్కృతము, సులభము,

జనాహ్లాదకమునగు భాషాశైలిని గవులు, పండితులు, కథారచయితలు నుపయోగింతురని యాశించుచున్నాము.

సుప్రసిద్ధవైయాకరణపండితులును మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ బిరుదాంకితులు నగు బ్రహ్మశ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రివర్యులును, విజయనగర కళాశాలాంధ్రసంస్కృతోపన్యాసకులును నిరంతర భాషాసేవాధురంధరులు నగు శ్రీమేడేపల్లి వేంకటరమణాచార్యులు వారు నిటీవలఁ గాలధర్మము నొందుటచే నాంధ్రసారస్వతలోకమునకు గొప్ప లోటు వాటిల్లినది. వీరు మహాప్రసిద్ధులై తమశిష్యపరంపర చేతను, అఖిలాంధ్రవిద్వజ్జనసంఘము చేతను బ్రశంసింపఁబడుచుండిన ధన్యజీవితము గడపిరి. వీరి నాదర్శముగఁ గైకొనుచు పాండిత్యము, భాషాసేవ నలవఱచుకొని యువకులు సాహిత్యప్రపంచమున నిరంతరకృషి సలుపుదురు గాక.

నిఘంటు కార్యాలయమున నిఘంటురచనాదికములు యథాక్రమముగ సాగుచున్నవి. శ్రీశ్రీశ్రీ పీఠికాపురాధీశ్వరుల కార్యదీక్షచే నాల్గవసంపుటము (తవర్గాంతమువఱకు) వెలువడినది. అచిరకాలముననే మిగిలినదికూడ ముద్రితమై గ్రంథము సంపూర్తి నొందఁగలదు. గ్రంథముద్రణమునకు, బైండింగునకు వ్యయ మధికమైనను, భాషాభిమానుల కందుబాటులో నుండుటకై సంపుటములు పూర్వమువలె తక్కువ వెల కీయఁబడుచున్నవి. ముద్రితసంపుటములను బండితులు, గ్రంథాలయాధికారులు, భాషాభిమానులు నింకో నధికముగఁ గొని పరిషత్తు నిర్వహణమునకుఁ దోడ్పడఁ గోరుచున్నాము.

# కళాపూర్ణోదయము - పండితాభిప్రాయము.

శ్రీశ్రీశ్రీ పీఠికాపురాధీశ్వరులు పింగళిసూరనార్యకవివరేణ్యుని కవితావిశేషమునం దమకుంగల యాదరాభిమానముల చే నిటీవల బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రులవారి సంపాదకత్వమునం బ్రచురింపించి సాదరముగ మా కొసంగిన కళాపూర్ణోదయప్రబంధరత్నము నామూలాగ్రముగం బఠించి యమందానంద మందితిమి.

ఈ వఱకుం బలుమాఱు లీ మహాకావ్యము ముద్రితమై యున్నను వివిధములగు స్ఖాలిత్యములతో నిండి పెక్కుతావులం గవిభావములను స్పష్టపఱుపంజాలకుండినది. ఆ కొఱంత తీర్పంబూనిన శ్రీవారి ప్రయత్న మీ ముద్రణమున సర్వథా సఫలమైనది.

పూర్వముద్రణములందలి సందిగ్ధపాఠములు యతిభ్రంశములు మున్నగు పెక్కుదోషము లీముద్రణమున మేలుప్రతుల సహాయమున సరసముగ సంస్కరింపంబడినవి. ఉదాహరణముగం గొన్ని లక్ష్యముల మాత్ర మీ క్రిందం జూపుచున్నాము.

"కృతి దురావమొదవుం గీర్తియుం గాలు ని

కుంటగాదు హాసయోగ్యంజేయు" అని ముద్రితము లన్నిటను గలదు.

"కృతియుం దాంపుమొకవుం గీర్తియుం జాలు..." (౧. ౮) అని క్రొత్తప్రతిపాఠము. ఇది అన్వితము.

"వినరే యెవ్వరు పావం

బనం బుణ్యంబన నిషేధమన విధియన గీ

డన మేలనం బరలోకం

. . . . ." అని ముద్రితములన్నిటను గలదు.

"...క్రీ, డన మేలన నిహమనఁ బర, మనఁ దలఁపఁగ లేరుగాక...
(౨. ౧౦౭) అని సరసమగు పాఠమును మ్రొత్తప్రతి చేకొన్నది.

"అందముగాఁగ సంతత ఘనాఘనకాలము చాలనొప్పి ని
ష్పందిత గంధబంధనవనీపవనీకమనీభవన్మిళిం
దిందిరబృందము త్తసళిసీమలినీభవనాగతారసా
స్పందజగుత్సవిద్ధ్వనయశాయితయాయిమరాళజాలమై"

"యాయ మరాళజాలమై"

"మలినీభవనాగనాగనాస్పందజగుత్సవిద్ధ్వనయశాయితయాయిత
మరాళజాలమై" అని ముద్రితప్రతులలోని పాఠములు.

"...ఘనాగమకాలము... ...

"భవనాగతారసా, స్పందజగుత్సవిద్ధ్వనయశాయితయాయిమ
రాళజాలమై (౭. ౧౭౯) అని మ్రొత్త ప్రతిపాఠము.

"హేమంతం బఁత సంతర్జ్వాతకమలజలోదీతపిస్ఫీతశీత
శ్యామా త్మస్వామిధామక్రమణకృశపిపూర్ష ప్రవిశ్రాణితాతి
తేమప్రేమప్రకామప్రశితరతముదితస్త్రీముఖవ్యూహా..."

"క్రమణ కృశవపుర్ష ప్రవిశ్రాణిత" అని ముద్రితపాఠములు సందిగ్ధముగా నున్నవి.

"శ్యామాత్మ స్వామిధామక్రమణకృశవపుర్ఘప్రవిశ్రాణితాతి...
యామినల్ హెచ్చువచ్చెన్" (౭-౧౯౮) అని నూతన ప్రతిపాఠము.

## యతిభంగములు.

౮౦. జృంభిత తద్రోమభావ వినఁబడసంతేన్. అని ముద్రితముల న్నిటను గలదు.

"జృంభితతద్రోమభావ చెవిఁబడు సంతన్ (౫-౫౭) మ్రొత్తప్రతి.

చ. అసదృశభూషణాన్విత విలాస విచిత్రత...అని ముద్రితము లన్నిటను గలదు.

"లసదురుభూషణాన్వితవిలాసవిచిత్రత... అని నూతనప్రతి.

చ. బెదరుట లేక మైదుపదిసేయక పోరిరి..." అని ముద్రితము లన్నిటను గలదు.

"చెదరుట లేక మైదుపదిసేయక పోరిరి..."అని నూతనప్రతి పాఠము. ఇట్లే పెక్కులుగలవు.

ఇక్కవిసార్వభౌముని కవితాచమత్కృతులఁ గూర్చి శ్రీవారు విపులమగు పీఠికను గూర్చుట బంగారమునకుఁ బరిమళమబ్బినట్లు సమకూడినది.

ఇట్టి నిర్దుష్టములగు పాఠములను సంపాదించు సందర్భమున శ్రీ సుబ్బయ్యశాస్త్రిలవారు గావించిన ప్రయత్నము శ్లాఘాపాత్రము. ఆంధ్రభోజులగు శ్రీ మహారాజావారిట్టి యమూల్యప్రబంధ రత్నములఁ బ్రచురింపించి యాంధ్రసారస్వతమున కిత్తోధికాభ్యుదయము గలిగింతురుగాక.

ఇట్లు,

నిఘంటు కార్యాలయపండితులు.

# గ్రంథస్వీకారము.

1 భార్గవీశతకము:- ఏలే యల్లయకవి ప్రణీతము-(నైజాం భువనగిరి తాలూకా శిరిపురము) గ్రంథమునకు కవి కష్టనష్టములు అను నామాంతరమే యందలి విషయమును సూచించును-కవుల కష్టములు నేటివి కావు-లక్ష్మీ సరస్వతులవిరోధ మనాదినుండి వచ్చుచున్నది-అయినను కవులు పరితాపమునొందక తమ కవితాప్రపంచమును స్వేచ్ఛావిహార మొనర్పవలసియున్నది.

2 విక్రమప్రశస్తి:- భాషాప్రవీణ యామిజాల పద్మనాభస్వామి విరచితము-జయపురాధీశ్వర విక్రమదేవవర్మ మహారాజులుగారి కంకితము. జయపురాధీశ ప్రకృతిసౌందర్యములకు, ముగ్ధులై కవి రచించి శ్రీవారికి కానుకగానొసఁగిన 116 పద్యముల సంపుటము గ్రంథకర్త శ్రీతిరుపతి వేంకటకవీశ్వరుల శిష్యుఁడు. జయపురరాజ్య ప్రజలసత్ప్రవర్తనములు, భిల్లజాతుల ముగ్ధసౌందర్యములు, ప్రకరణానుగుణముగ వర్ణితములు. బస్సు, రైళ్ళు, మోటారు మున్నగు నవ్యదేశీయపదము లుపయోగింపఁబడినవి. కవిత్వము రమణీయమై సులభముగనున్నది.

3 పాణినీయము:- కావ్యవాఙ్మయము. బ్రహ్మశ్రీ ఉభయభాషా ప్రవీణ వ్యాకరణ విద్యాప్రవీణ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచింపబడిన భాషావిమర్శ పరిశోధకవ్యాస సంపుటము.

ఇందలి వ్యాసములు మూఁడుభాగములుగ విభజింపబడినవి. (1) పాణినీయ పరిశోధనము (2) మహాకవి ప్రయోగసాధనము (3) అనుబంధ పరామర్శము. సుప్రసిద్ధవైయాకరణులగు శ్రీవఝ్ఝలచినసీతారామ శాస్త్రిగారు తమ చింతామణీవిషయపరిశోధనమును సంస్కృత వైయాకరణులనుగూర్చి వ్రాయుచు పాణిని కాలమునాఁటికి వ్యావహారికభాషఁ వేదభాష, శిష్టవ్యవహారభాషయని భాష మూఁడు తెఱఁగులుగ నుండె

వనియు నందు శిష్టవ్యవహారభాషకే మునిత్రయమువారు వ్యాకరణమును రచించిరనియు, భారత రామాయణాదికావ్యములఁగల భాషకు వారను శాసనముల రచింపలేదనియు, సూత్రములను వ్యవహారభాషలో రచించి రనియు నిత్యాదిగ వ్రాసియుండిరి. అవి శ్రీ గిడుగువారి సంప్రదాయా నుగుణ్యముగ నుండునటుల వ్రాసిన విషయములుగాని భాషాస్వరూప మును, వ్యాకరణ రచనావిధానములను తిరస్కరించి వ్రాయఁబడినవిగావు. ఆ యావిషయములను శ్రీవసముగ సక్రమముగ గ్రంథకర్తలు విమర్శించి యీగ్రంథమునందలి వ్యాసముల రచించిరి. పాణినీయాది వైయాకరణులు గ్రంథస్థమగు కావ్యభాషకే యనుశాసనము రచించిరనియు నందు పెక్కు ప్రయోగములఁగూడ సాధించిరనియు, మహాకవుల ప్రామాదిక ప్రయో గములని భ్రమింపఁదగినని పెక్కింటిని మహాభాష్యాది గ్రంథములందును వ్యాఖ్యానములందును సమర్థించి యుండిరనియు, భాషను శిష్టవ్యవహా రము వ్యావహారిక మని విభజించుట పొరపాటనియు నీరు విమర్శించి యున్నారు. ఇందలి విషయములు భాషాశాస్త్రమను కన్నుతో ప్రయోగ ములు. వ్యవహారము శిష్టవ్యవహారమని యనుభాష గ్రంథస్థమగు భాష కాదనియు, శక్తిభాషకు వైయాకరణు లనుశాసనముల రచింపలేదనియు నీగ్రంథమునందలి సారాంశము.

4 షడ్దర్శన సంగ్రహము: మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు, పల్లిపాలెము, కాకినాడ, తా

ఇది హరిభద్ర సూరికృతమగు శ్లోకరూప గ్రంథమునకు మృదు మధుర మగువచనానువాదము. ఇందు బౌద్ధ నైయాయిక సాంఖ్య జైన వైశేషిక జైమినీయ చార్వాకము లనుదర్శనములపై సంగ్రహచర్చ కలదు. ఇదివఱకు నచ్చటచ్చటఁ బ్రత్యేకముగ దర్శనవిషయములు పలువురచేఁ బ్రకటింపఁబడినవి. కాని గ్రంథాకారములో నున్నవి విరళము. ఏకత్ర నిరూపించుటయే శాస్త్రిగారి యుద్దేశము. దార్శనికవిషయములు గాన నింతకంటె విపులీకరించిన నుపయోగముగ నుండును.

5 వేల్పుటావు:- ప్రాప్తిస్థానము. జి. వెంకటేశ్వరరావుగారు, జాంద్రపేట, చీరాలపోష్టు, బాపట్లతాలూకా.

ఈచిన్నికావ్యము మధురకవి గొరాబత్తుని వేంకటేశ్వరరావుగారిచే రచింపఁబడినది. ఈకథావస్తువు భారతమరణ్యపర్వము ప్రథమాశ్వాసమునుండి గ్రహింపఁబడినది. ఎనుబది పద్యములలో ముగించినారు. చక్కనిశైలిలో రచనము సాఁగినది. వెల. 6 అణాలు.

6 భాగ్యలక్ష్మి—ఇదియొక ఖండకావ్యము. ఇదియు మధురకవిగారి రచనయే. ఇందలి విశేషము ప్రాచీన నవీనములగు పద్ధతుల స్వీయత్రీకృత మొనర్చుకొనుటయే. ఇందు నాయికానాయకుల సౌందర్యవర్ణనమున ప్రబంధశైలికానవచ్చుచున్నది. నాయికా నాయకుల ప్రేమావిష్కరణముల భావకులభంగిమ కానవచ్చుచున్నది. అచ్చటచ్చట 'ఉమర్ ఖయ్యామ్' రుబాయతీలను తలఁపించు పద్యములు కూడఁగలవు. కవిత్వమునుగూర్చియు శైలినిగూర్చియు పీఠికాకర్తలు వ్రాసిచ్చినది యతిశయోక్తియనఁ జెల్లదు. వెల 13 అణాలు.

7 భారతీసాక్షాత్కారము:- వాజపేయయాజుల రామసుబ్బరాయఁడు. స్నేహలతాకవితాసంఘము, కొల్లాపురము.

ఇది భారతీదేవినిగూర్చి రెండువందల పద్యములలోఁ జేసిన స్తోత్రగ్రంథము. కవిత ధారాళముగా నున్నది. ఆయాప్రాచీనాంధ్రకవులు చేసిన భారతీస్తోత్రపద్యములుకూడ నిందు పొందుపఱుపఁబడినవి. ఈకృతి శ్రీసురభి వేంకటరత్నమాంబా మహారాజ్ఞీమణికి నంకిత మీయఁబడినది. స్నేహలతాకవితాసంఘమును, ఈకవిగారిని బరిచయముచేయుట సిద్ధసాధనము.

8 గాయత్రీతారావళి:- గ్రంథకర్తలు పైవారే. ఇది ౨౭ పద్యములలో రచింపఁబడిన గాయత్రీజప ప్రాముఖ్య ప్రకటనగ్రంథము.

—

# వి జ య వి హా ర ము

వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వాన్, చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఉ. ద్వైతవనంబులో విబుధవంద్యులు పాండవు లాత్మనిష్ఠ ని
ష్ఠాతకదర్వఖేదులు వధూమణితో వసియించుచుండ, నా
పూతచరిత్రు లామునులపొందున సర్వశుభైకమూలముల్
వీతవికారబుద్ధిఁ గురువీరుఁడు గైకొనె ధర్మనిష్ఠతన్. ౧

ఉ. అంతట వార లావని నిరంతరశాంతి మెలంగుచుండ, వే
దాంతవిహారలాలసు మహాత్ముని సాత్యవతేయుఁ గాంచి, య
త్యంతము భక్తిఁ దన్మునిపదాంబుజహారి నఖాగ్రగళిస్వర
త్కాంతిలతాంతముల్ జడలఁ దత్పరతన్ ధరియించి రందఱున్ ౨

ఉ. తాపసయూథనాథుఁడు సుధారసపూర్ణకవిత్వయుక్తుఁ డౌ
ద్వీపజుఁ డాత్మజన్మపదివిన్ వెసఁ జేరఁ బరాభవోష్మసం
తాపితు లైనవారలు నితాంతజలస్రుతి దాల్చి రక్షులన్
దీపితవృష్టిఁ దేలనొకో? దేశము సత్కవి స్వాతిఁ జేరినన్. ౩

ఉ. మానివతంసుఁ డెంతొ బహుమానముతో సిడ విద్య నొంకు, స
మ్మానితకీర్తి ధర్మజుఁడు మక్కువ మీఱఁ గవుంగిలించి, స
మ్మానముతోడఁ బంప పరమం బగునస్త్రము పొందఁగా హిమా
నీనగయాత్ర సల్పె గుణనీరధి పార్థుఁడు నీశుఁ గొల్వఁగన్. ౪

చ. హిమము ఘనీభవించి చలి హెచ్చఁగ దేహము నొంచుచుండ నా
హిమగిరిఁ గాఁపురంబు వెలయించెనియత్తునికాయ మెల్లయుం
గములుఁ మనోజ్ఞమై తనరఁగాఁ దనుమధ్యలపెద్దవానుగో
జముల నకంపచోష్ణములఁ జక్కఁగ సేవ యొనర్తు రెప్పుడున్. ౫

శా. గోరూపంబును భూమి తాల్ప, పృథువున్ గోపాలుఁ డై చూప, నే
పారం గోమలవత్సభావమున స్వాయమ్నూత్నరత్నప్రభా

పూరతక్షీరము చక్కఁ గ్రోలి, భర మై పొంగారఁగా నిస్సర
త్సారంబట్టు మనశ్శిలార్ఝురుల నాశైలంబు మించెంచగన్. ౬

గీ. బలిమిఁ బర్వత మెక్కు-నాపార్థునాన
నాబ్జమునఁ బొల్చుస్వేదకణాళిమధువు
పిల్లవాయువు గ్రోలి శోభిల్లఁ జేసి
భ్రమరభావము తన కెంతొ భాసురముగ. ౭

చ. జగములతల్లిదండ్రులు సజస్రము నొండొరు వీడ కుండఁగా
మగఁడును నాలి నై పొలుచుమంగళరూపము దాల్చినార లీ
యుగమున సత్త్వరంబు చెలు వందఁగఁ జేసినకారణంబునన్
నగడెద మేము నట్టు లని నిత్యము మ్రొక్కెడిమానులం గనెన్. ౮

క. నగజాత మగనిఁ గోరుచు
నిగమాంతరచారిమానినికరము నతముఁన్
బెగడొందఁ దపము సల్పిన
నగమధ్యస్థితతపోవనంబుం జూచెన్. ౯

ఉ. మృగవృషభంబు డగ్గఱిన మేఁతను గానుక సీయనో యనన్
పిడికెఁడుదర్భఖండములు ప్రీతి భుజించుచు నెల్లవేళలన్
కడఁగి మనంబు నీశపదకంజములందుఁ దిరంబు చేసి య,
వ్వాడు దొడఁగె న్మహామతి తపోనియమంబును బార్థుఁ డర్థిమై. ౧౦

చ. వివిధతపోవిశేషపదవీస్థితిఁ డాతఁ డరాతినిర్జితం
బవని యటంచు పాదయుగమంసయు మోఁపఁగఁ గొంకువాఁడు నాన్
భువిని బదాగ్రమాత్రమునఁ బొల్చి, చలింపక యుంచు కేనియాం
బ్రవితులనిమ్న యోర్పడఁ దపం బొనరించెను నిష్ఠురంబుగన్. ౧౧

ఉ. భానుఁడు తీవ్రతేజమున ఫాలతలంబు తపింపఁ జేయ, స
మ్మానిత తేజుఁ డాకిరణమధ్యమునం దనదృష్టి నిల్పె; వై
శ్వానరుఁడుం గిరీటి నలువంకలఁ జుట్టఁగ నొప్పె; భుక్తికై
కానన మొందు కోరి పదకంజములం బడి వేఁడువాఁడునాన్. ౧౨

ఉ. వాసవినామసామ్యమున బాంధవ మేర్పడియుంట నేమొ యు
ద్భాసితు నాధనంజయుని పార్శ్వములం దగఁ గూర్చి; నట్టి లా
రా! సృజియించి తంగవిషయాధిపు వైరిగ నాకటంచు బల్
రోషము దాల్చె నాన్ ఖరకరుం బరికించును తీక్ష్ణదృష్టిమైన్. ౧౩

ఉ. వ్యాసమునీంద్రుఁ డర్జునుఁ గృతార్థునిఁ జేయ మహోపదేశముం
జేసినమంత్రభాగములఁ జిన్మయు శంకరు నంతరంగమం
దాన భజించి, యానియతి నందఱ మానులఁ గ్రిందుసేయ సం
తోసముఁ బూనెనో యనఁగ దొంతర లౌజస లూనె మౌళిపై. ౧౪

గీ. ఓలి ఫలవర్ణవాయువు లోగిరముగ
సేకరించుట విడువ నాశీలధనుని
యత్నగుణ మెల్లవేళఁ గరాగ్రమందె
లోల మయ్యెను విషయముల్ గ్రోలదయ్యె. ౧౫

ఉ. అంతటవిష్ణుతో నతఁ డహర్నిశముం దరుణేందుమౌళి న
త్యంతదయార్ద్రచిత్తు ననయంబును నాత్మవశం బొనర్ప నా
వంతయు భూతలంబునఁ బదాగ్రము మోపియు బాహులెత్తు చొ
ప్పెంతయు వింతగూర్చె నిటు లీతఁడు మీఁదిఫలంబు లందువాన్. ౧౬

చ. అనిలవిరోధ మేర్పడఁగ నబ్బుర మాతప మాచరించు న
ర్జునుశిరమందుఁ బుట్టి మిను సోఁకఁగ నల్గడలందుఁ బర్వి యే
చినవికటస్ఫులింగములఁ జిమ్ము ఘనూతనధూమరాజి యా
తనికి ధనంజయాభిధను తథ్యముగా నొనరించె నత్తఱిన్. ౧౭

ఉ. నారదమౌనివర్యవదనంబున వెల్వడువాక్యులన్ మహో
భారము గొన్నయర్జునతపంబు దయాంబుధి శంకరుండు సొం
పారఁగ విన్చునుండ, జగదంబిక యాసభఁ గన్నుసన్న నా
వీరునిఁ జూడ నిచ్చ ప్రభవించెను నంచు నెఱుంగఁజేసినన్. ౧౮

గీ. సర్వమంగళ కెంతయుసంతసంబు
కలుఁగఁజేయఁగ మనమునఁ దలఁచి శివుఁడు

ఈయ నెంచియు ఫల్గుణాభీష్ట మప్పుడ
వేడ్క ధరియించె లుబ్ధునివేషబంబు ౧౯

సీ. ధరియించి రాదిమదంపతుల్ మాయాకి
రాతవేషంబులు ప్రీతితోడ
తిలకంబు దిద్దిరి ద్విపవదనాంచిత
గణనాథకరటపంకంబుతోడ
జడకుచ్చుగట్టిరి స్కందవాహనశిఖి
పింఛంబు నించుక ప్రిదులఁ జేసి
తాల్చిరి కటిని మందాకినీనిమ్నగా
తీరవృక్షచ్ఛదచీరములను

గీ. ఎఱుకసానియు మఱియు నా యెఱుకతేఁడు
విల్లు నమ్ములఁ దాల్చిరి వెరవు మిగుల
పూని ధరియించి రమ్ములపొదులఁ గట్టి
స్త్రీయపరికరబంధంబు సిద్ధి నొంద. ౨౧

గీ. పరపురుషుఁ డిట్లు శబరత్వ్వధరుఁడు గాఁగ
మొదటివర్ణంబు శిశిఖండిపదముఁ దొలఁగి
చయ్య నొరుఁ జేరఁ బరుఁ డంత శబరుఁ డయ్యెఁ
బొలిచెను శిఖండ మై శిరోభూషణంబు ౨౧

ఉ. తోడన రాజతాచలము తొయ్యలితోడ హరుండు వీడ, వీ
రేడకుఁ బోవువారొ యిటు లెక్కటి నంచుచు సంశయించియున్
వేడుక మీఱఁగా శబరవేషములన్ ధరియించి గ్రక్కునన్
గూడిరి వారలన్ బ్రమథకూటము లొండొరు మీఱ సందడిన్. ౨౨

సీ. తోఁకల నిట్టటు త్రుళ్లింపఁజేయుచుఁ
బలుతెఱంగులఁ గానఁ బరుగులిడుచు
దూరచారశ్రమ తోర మై పొడమిన
నలసట మేనెల్ల నలయఁజేయ

ప్రేలెడు నాల్కల లాలాజలంబులు
జాలువాఱఁగ వనసరణి నెంతొ
స్వచ్ఛతరంబుగా నలుపుచు; దృఢతర
శ్వాసంబులను దేహచలన మొప్పఁ
గీ. బొదలఁ జొచ్చియు మృగముల వెదకి వెదకి
హుంకరించుచు బీరంబు పొంక మమర
విశ్వనిగమము లనియెడి వేఁటకుక్క
లిరుగెలంకులఁ దవులుచుఁ దెరలె నపుడు. ౨3

క. కరభూషణముగఁ దాల్చిన
హరిణకిశోరంబె మృగసమాకర్షణకై
వెర వగుదీపకమృగగతిఁ
గర మొప్పఁగ వెంట నంటి కానఁగవచ్చెన్. ౨౪

చ. జననియు శంకరుండు హిమశైలదరీపథ మంటి రాఁగ, గ్ర
క్కున వనదేవతాసమితి కోమలకల్పకపల్లవంబులన్
ననలను జల్లి, ఘోరతుహినంబున వారల కించుకేని వే
దన గలుగంగ నీక శ్రమదంబునఁ గొల్చెను మార్గమెల్లెడన్. ౨౫

ఉ. ఎక్కడివార లీమొఱఁగి లెన్నఁడు పూర్వ మెఱుంగ రారు; పీ
రక్కట మాయరణ్య మిటు లాక్రమణం బొనరింప నేరత
మ్మొక్కొ యటం చనాయడవినొప్పుకిరాతులు రోస మెక్కఁగా
నొక్కమొగిన్ సమాగతుల నుక్కడఁగింపఁ గడంగి రత్తఱిన్. ౨౬

గీ. శంకరునిదివ్యతేజఃప్రసారకలన
శబరయువకులయుత్సాహసరణి యంత
చల్లనయ్యెను; గుండెలు జల్లు రనఁగఁ
జూచుచుండిరి వారలు చోద్య మంది. ౨౭

సీ. మానివరేణ్యు లా మాయాకిరాతుల
వేడబంబులఁ గాంచి వెఱఁగు నంది

మార్గమధ్యమున విమానవేగము నాఁపి
భక్త్యతిరేకంబు పల్లవింప
ప్రీతి జటావల్లరీమూలపల్లవం
బుల నంజలిపుటంబు లలవరించి
హర్షాశ్రుసమ్మిశ్రితానిలరంబులతోడ
జయజయశబ్దముల్ జడిగొనంగ

గీ. తలరి యాజగదాదిమదంపతులును
నియమ మేర్పడఁ దపమును నిర్వహించు
నాసునాశీరసుతతపోవాసభూమి
నడుగు లిడఁగఁ దొడంగి రత్యంతప్రీతి ౨౮

చ. శ్రవణమునందు ప్రేలఁబడుసారతరంబగు నక్షమాలికన్
దవులుట జెక్క లూడినవిధంబునఁ బొల్చెడి బాణపంక్తి నా
శివునిశరీరమం దడరఁజేసెను; లింగమయస్వరూపుపై
నవసుమపుంజముం గురిసినాఁ యను భాతి దలిర్ప నత్తఱిన్. ౨౯

శా. పాదాగ్రంబుల నంటి ప్రేలెడుజటాభారంబు సంధించి, స
మ్మోదం బొప్పఁగ నాతపమ్మె యశనమ్ముం గాఁ దపోవృత్తిని
హ్లాదకత్వము నూని యుంట గతదోస్సారున్ బృథాసూనుఁ బ్రే
మాదార్యంబులఁ జూచునాయుమకుఁబుత్రౌత్సుక్యమొప్పెం గడున్.

ఉ. అంతట భూమిభాగము ఖురాగ్రములం జదియంగ మెట్టుచున్
వింత దలిర్పుఁరోసమున వేమఱు ఘుంకృతి సల్పుచున్ మహా
ద్దాంతశరీరవై కృతిని దాల్చినకోలము ఫల్గునాశ్రమో
పాంతమునన్ భయంకరవిహారము సల్పఁ గడంగె నత్తఱిన్. ౩౧

చ. భయదవిహారముం గొని విభాసిలునాకిటిఁ జూచునంత నే
రయమునఁ గృష్ణశాబనికరం బటు వల్కలమందు డాఁగ, ప్రేఁ
గయినగళస్వనంబుల విహంగమపంక్తి భయంబు దెల్పినన్
నియమము నజ్జగించి వెస నించెను జేతఁ గిరీటి చాపమున్. ౩౨

గీ. ముఖర మహానట్టు గుణమును మొరయఁజేసి
వీరమానియుఁ గిటి నేయ వెడలునంత
ప్రమథచరులు వెంట నంటఁగా శబరుఁ డొకఁడు
ధనువు నెక్కిడి తలుపుచుఁ గనఁగ వచ్చె. 33

చ. "విడువకు బాణ మోరి కిటివెంబడి నే నిటు చాలఁ బ్రొద్దుగా
నడుగక వచ్చుచుంటి" నని యుద్ధతిఁ బల్కు కిరాతువల్కులన్
పెడచెవిఁ బెట్టుచుం బరిభవించినగర్వము మీఱ నాకిటిన్
వడిఁ దెగనేసె నస్త్రముల ఫల్గునుఁ డంత నఫల్గుసారుఁడై. 34

ఉ. ఆసమయంబునందె శివుఁ డస్త్రము నేసె శివార్జునాస్త్రవి
న్యాసము నేకకాలమున నక్కిటిదేహము నొవ్వఁదుప్పి పే
రాసను దానిమాయవు సమాంశముగా భుజియించె; సోదరుల్
కాసును వీస మైన జనకద్రవిణంబు భుజించుకైవడిన్. 35

క. శబరునివచనములను వినఁ
బ్రబలం బగురోష మంతరంగము గలఁపన్
దబిసి యగువిజయుఁ డదలో
నిబిడం బగుశాంతిఁ బూని నేర్పునఁ బలికెన్. 36

సీ. నాయుధికారంబు నాఁటి యున్నట్టియా
యాశ్రమంబునఁ గోల మసుగుపెట్టి
కాంచినయంతనే కకఁకమైఁ జేసితి
శరపాతమునకు లక్ష్యంబు గాఁగ
వీరుఁడ నైనన్ హితేఁడిగా నెంచి
యవహేళనము సేయు నదరి తీవు
అమ్మ్మ వహ్మాటకు నమ్మ్మ నీ వృద్ధతి
బాణముల్ దీనిపైఁ బఱపినావు
శాపదానమువనో లేక చాపమునొ
నీవుతు ల్లంత యడఁగింప నేర్పు గలదు

అయిన నోర్చితిఁ దపమున నణఁగియుంట
నలవి మీఱిననిజభుజోద్యమలతఁ దలఁచి. ౩౮

క. ఈరీతిఁ పల్కు నాముని
వీరుని దర్పప్రవాహ వేశిన్ వాణిన్
మేరుధనుర్ధారియు విని
స్మేరముఖాబ్జమున సొగసు చిందఁగఁ బలికెన్. ౩౯

చ తెలుపుచునుండె నీపలుకె తేటగ నీదగుబుద్ధిమార్దవం
బెలమి నరణ్యసీమఁ బశుహింసన మిట్టులు చేయఁగొంట కే
వలము స్వధర్మ మాశబరవర్యుల కానో? తపఃక్రియావ్రత
స్థలకగునో? యెఱుంగు మది సూక్ష్మముగాఁబరికించి నెమ్మదిన్ ౩౯

క. స్వకులాచారంబును విడు
వక మెలఁగెడినాకు నీతపంబునవలె నే
వికటాచారము సల్పియుఁ
బ్రకటించెద వౌర! నీవరాక్రమకీర్తుల్. ౪౦

చ. విపినమునందు జంతువుల వేఁటలఁ జంపఁగఁ గచ్చఁగట్టు నీ
తపమున శుద్ధి యెంతో విశద మ్మగు;దాని నటుండనిమ్ము; నే
రుపు వెలయంగ నీమృగము రూపుబుఁ జేసెడి వేళ నాశర
ప్రపతన మూఁత గొన్ననిజబాహుబలంబును దెల్ల మెల్లెడన్. ౪౧

చ. పరుషవచఃప్రసారమున భర్గుఁడు నాతనిఁ జేరఁ బిల్చి, యో
మిర! శరణమ్ము వేఁడు నను, మీఱఁగఁ బోకుము; నాదుపేర్మి కీ
వరయఁగ నెంతవాఁడ;వపురా! నయునమ్మున నే నొకింత నేఁ
డరుణిమ దాల్తునేని భయమందెదుఁ జుమ్మీ కృతాంతుఁడేనియున్ ౪౨

క. శంకరుఁ డీగతిఁ బలికె న
హంకారము మీఱ; నంత నర్జునుఁ డెద సా
తంక త నిష్ఠురవచనం
బంకురిలమఁ జేసి సాహసాంకిత మెఱయన్. ౪౩

ఉ. ఓరి వనేచరాపసద ! యుద్ధతి చూపెదు నా సమక్షమం
దార! యిటుల్ త్వదీయులకు హర్షము సంధిలఁ బల్కుచుంటి వీ
వారయనైతివే మగనొ ? యక్కట మక్కువ నీకిరాతి సొం
పారఁగ మక్కువత్తుఁ జెవియాకులుఁ దాల్పఁదలంపు లేదొకో? ౪౪

ఉ. పీచులఁ గాల్పఁబట్టి కురువీరుని వాక్కులు విన్నయంత లో
నూని సుపర్వమౌం బ్రమథయోధులు చంపఁగఁ బూని రాత్మసిం
గాని, దయార్ద్రచిత్త యగుగౌరిముఖంబునఁ జింతలాడునా
లేనగవుం గనంగఁ బెకలించినయమ్ములఁ దాల్చి రట్టులన్. ౪౫

గీ. భిల్లమల్లుఁడు కురువంశవల్లభుండు
ఫుల్లభల్లంబులను శల్యపల్లవముల
దేవతలదృష్టి బ్రసరింపఁ దెరువు నీకని
నవర మతిభయంకరముగ జేసి రపుడు. ౪౬

ఉ. రోస మొకింత దాల్చినటు రుద్రుఁడు తానఁగ వచ్చి, వేగ వి
ష్వాసము మీట్టి, గోమునమం దొకయింపుక శంకఁ బూని, యా
వాసవసూతికి మ్రొక్కి నభంగురమంగళవృష్టిఁ గోరి, పే
రాసఁ బఠించె నామమయు 'యాతఇషు' శ్శ్రుతి విస్తవంబునన్ ౪౭

చ. నరగ ధనుర్గుణంబు దృఢసారతఁ గర్ణముదాఁక లాగి శం
కరుఁడు దయామయాంబుధి గావున సింద్రతనూజు మేనిపై
శరములు కొన్ని వైచె; నరసం జని తాఁకియుఁ దాఁకనట్టి వో
వెరవున, కొన్ని లక్ష్యమును వీడియుఁ జన్నవిధంబు తోఁపగన్. ౪౮

ఉ. అమ్ములు వమ్ముపోవ నెద నజ్జునుఁ డబ్బుర మందుచు స్సినం
గమ్ములు సొమ్ము గోల్పడినఁ గ్రచ్చఱ నీసున నాయగాత్మజా
సమ్ముఖమందె శంకరుని జాపముతో శిరమందు వ్రేసె వే
గమ్మున నా వ్రణమ్ము శశిఖండసఖిత్వము దాల్పునట్టుగాన్. ౪౯

గీ. చాపమున మోఁదఁబడిన యీశ్వరునిమౌళి
తల్లమునుండి తోఁ అంగురక్తాంబుకణము

లోలి భూమిని వ్రాతె నత్యుజ్జ్వలముగ
ఫణిఫణామణు లుర్విపైఁ బడెడుభంగి. ౫౦

ఉ. ఆజగమేలుతండ్రి హరుఁ డర్జునచాపము ప్రేటు నంది, ని
ర్వ్యాజము గా మనంబునఁ గరంబు వహించినహర్ష వార్ధి నే
రాజను బోలదయ్యె; మును హుంకృతిమాత్రఁ గజాస్యుఁ డొప్పి వి
భ్రాజితలీల గంగదరి వప్రవిహారము చేయువేడుకల్. ౫౧

సీ. గాండీవ మిదియు మున్ ఖాండవం బేర్చెడి
సమయమునం దగ్నికి సాయపడియె
తక్షకునిల్లాండ్రు తరలి నశింపఁగా
ప్రథమకారణ మైనబడియు నిదియు
ఇంద్రుఁ డడ్డము రాఁగ నెట్టుచు జోరనీక
వెతలఁ బెట్టినయట్టి విదురుసుమ్ము
పెద్దకాలమునుండి పేర్చినవైరంబు
మనజాతితోడఁ దాల్చినదిసుమ్ము

గీ. అనుచుఁ గ్రోధము దాల్చి యాహారునిమాళి
జడలగుబురున వాసంబు సలుపుచున్న
ఫణులు లతి చూచి దాని భక్షణము సేసె
ననఁగ గాండీవదండంబు నణఁగె నచట. ౫౨

సీ. దైవవిపర్యయం బీవిధిఁ గల్గెనా
అటుగాక వీనిమాయావిధంబొ
భావింపఁగా రానిపథ మిది యేదియో
తెలియకున్నది నాకుఁ దేలపడఁగ
అంచు నడుంద నొక్కించుక చింతిలి
ధైర్యంబు నంతలోఁ దాల్చి క్రీడి
ఉత్సాహశక్తిలో నుజ్జ్వలమై పొంగ
నీశ్వరు గద్దించి యిట్టు లనియె

గీ. ఎఱుక ! మహాత్మ ! నీ వెట కేఁగఁ గలవు
అర్జునునిఁ గూడ నిర్జించి యశము గొనఁగఁ
జాలెదవురా ? యటంచుఁ దర్జనము చేసి
తలపడఁగఁ జొచ్చె బాహాయుద్ధమున నతఁడు. ౫౩

గీ. తపసి, నిష్ఠురతరముష్టితాడనమున
శబరవీరుని వామవక్షమున వ్రేయ
నెఱుకసానియురంబున వఱలుఁ బట్టి
తెల్లగురివెంద పేరులు ద్రెవ్వి పడియె ౫౪

చ. చిరముగ నిత్యుపానమునఁ జిక్కినయామునివక్షమందు శం
కరుఁడును ముష్టిమార్దవము గన్పడఁగన్ గ్రమ్మఱ నేసె వాని, నా
హరువున నింద్రసూనుహృదయంబున వాసము గొన్న తన్వి దు
ర్భరశరపాతవ్యథలు పాయఁగఁ జేయఁ గడంగెనో యనన్. ౫౫

సీ. ముష్టిప్రహారముల్ ముమ్మరమై చన
నొండొరు మీఱి వారదుటు గొనిరి
పెనఁకువల్ పెరుఁగఁగ వనకుసుమరాగ
భస్మాంగరాగ లేపములు గొనిరి
ఒక్కొక్క బాహువు నొక్కొక్క సారించి
జడల నొండొరు నొంటఁ గడఁగి రపుడు
తక్కినభుజమునఁ దార్కొని యన్యోన్య
గళనాళములు చుట్టఁ గడలుకొనిరి

గీ. శబరవిభుఁడు తపోధనసత్తముఁడును
నొండొరుల మీఱు నుద్ధతి నొనరఁ దాల్చి
సమబలత్వము చెల్ల నాహిమనగంబు
పెద్దచటియను గూలిరి పెలుచ నపుడు. ౫౬

చ. శబరు నధోముఖంబు గొనుచందమునం ధరఁ గూలనేసియున్
బ్రబలి విమోహమేర్పడఁగఁ బార్థుఁడు నిష్ఠురప్రస్తరస్థలిన్

నిబిడముగాఁ గవుంగిటను గ్రుంచినచో ధ్రువమౌ; స్తనంబుతోఁ
దబిసిని నన్నుఁ గాచెడికతమ్మున నల్లునిఁ జెల్వఁ గోరువాన్. ౫౭

ఉ. సంగరమందుఁ బార్థునిభుజంబుల నొప్పెడివీర్యరేఖ నో
ప్పం గని శంకరుండు బహుభంగుల విస్మయ మంది మౌళిపైఁ
బొంగెడు జాహ్నవీనిముల పూరకణంబులఁ గంటిమీఁదఁ జే
రం గనుపించ నందియు శిరశ్చలనంబు వహించువేడ్కమై. ౫౮

గీ. ఈగతిఁ దడవుగ భూమిని
ధోగతుఁడై యుంచి కలఁగ దొలఁగిన సంజ్ఞన్
స్వాగతసముదాచారస
మాగమమున నింద్రసూనుఁ దల్లన లేచెన్. ౫౯

ఉ. కన్నుల విప్పుచో నెదుటఁ గానఁగవచ్చెఁ గిరాతుఁడే ప్రభా
భ్యున్నతదివ్యతేజమున నొప్పినశంకరుఁ, డాకిరాతియే
యున్నులమిన్న సర్వజగదంబిక యాగిరిరాజకన్య, యిం
కెన్నఁగ శక్యమే సాటి గదెట్టిగుణాఢ్యులకైన నయ్యెడన్. ౬౦

ఉ. వీనులవిందుగా నమృతవృష్టిని జిల్కెడుభంగిఁ గంఠగ
ర్జాసినదంబుతోఁ బెఱుగరం బగుఘంటలతాంకృతుల్ మృదు
ధ్వానము లీన లోకదురితంబులు చెందుమహోక్ష మెక్కి శ
ర్వాణితోఁ గూడి శంకరుఁడు వచ్చె నతండు ప్రసన్నహాసుఁడై. ౬౧

క. పారిషదగణము లంజలి
సారసవన మొదవఁ జేయ సరసత నకుమున్
గౌరీకాంతుఁడు దివ్యని
హారముతోఁ బొలుచురాజహంసం బయ్యెన్. ౬౨

సీ. మార్దవనమువేరి శార్దూలచర్మంబు
పట్ట్యయనంబుగా పఱుక, మీఁద
నద్దంబుగాఁ జరణాంబుజయుగ్మము
ప్రసరింపఁజేయుచుఁ బ్రక్కఁ జేరి

యాదటవీరాట శిలాదకుమారుండు
సంవాహనము ప్రీతిఁ జలుపుచుండ
దర్పము నిగుడ నుల్లేపనంబు చేసెడి
తేటి యానమును వాఁడఁ దగినరీతి

గీ. గళము పై వేలుకనకశృంఖలము జేతఁ
బూని యత్యంతమృదుకరపుటము తోడ
కకుదశృంగంబులను మెల్లఁగా నిమురుచుఁ
జెంత మెలఁగెడిశృంగితో నంతొ యొక్క ౬౩

ఉ. శంకరమౌళిసీమ ననిశంబు విభూషణ మై తనర్చునే
ర్పాటుఁను గాండివాతిశతి వాహతి నుక్కఱె నంచుఁ దారకల్
కింక దొఱంగ నాశ్రయమునిం దగ నూఱటఁ గూర్ప వ్రాలెన
న్శంక దలిర్పఁ గల్పసుమసంహతివృష్టి దలిర్చె శర్వుపైన్. ౬౪

చ. కడుకొని సారమేయములకంతువ నొప్పెడినాల్గువేదముల్
వెడఁగు దలిర్పఁగా నపుడె విశ్రుతపూరువరూప మేర్పడన్
జడలను భస్మముం మ్రుముకుశంబులఁ జీరలఁ జేతఁ దాల్చి యా
మృదుబిరుదంబులన్ స్వరము మించఁగ గానము చేసె నింపుగన్.

ఉ. అంబరవీథి డగ్గఱుచు నబ్బుర మేర్పడఁ జూచి వేడ్కతో
తుంబురముఖ్యవైణికులు తోరముగాఁ దమకీర్తిరీతిరా
గంబున నామహేశు ననుకంపను భక్తజనౌఘరక్షణా
లంబనసత్కథల్ మృదుకలంబుగఁ బాడిరి భక్తిపెంపునన్. ౬౬

గీ. భూతనాథుఁడు తన శ్రవఃపూరముగను
పొసఁగఁ దాల్చిన తాపింఛకుసుమగుచ్ఛ
మునఁ దొఱంగెడి తేనియసోనవలెను
మించుచూపులఁ గృపను వర్షించె నడరి. ౬౭

గీ. అర్జునోన్ముక్తబాణప్రహారజాత
వ్రణము లిట్లంగ మొల్లెడ వఱలె ననఁగ

విమలదీప్తివితానంబు వెల్లివిరియు
ఫణిఫణారత్నభూషలు పరిఢవించె. ౬౮

క. అవతంసచంద్రరేఖా
ప్రవిగళితమయూఖకాంతిపాతజశైత్యం
బు వహింపఁగనియటు చిఱుతన
గవున వ్యాదంతఃప్రసాదగతి సూచించెన్. ౬౯

ఉ. వాసవి యాదిదేవు మునివంద్యుని శంకరుఁ జూచునంతఁ బ
న్నాగవరణంబు ద్రోయఁ బటుభారము దాల్చినసమ్మదాశ్రురే
ఖావళి దేహమందఁ బులకాంకురముల్ వెలయింపఁ బాదప
ద్మావనతుండు నై నతుల నప్పనచేసెను వేనవేలుగన్. ౭౦

శా. స్వామీ! నే నిటు మూఢబుద్ధి నయి నీసామర్థ్యముం గాన కీ
ర్ష్యామేమో వచియించినాఁడ; మనమం దీ సొప్పు వాగ్బాణచా
పామోక్షంబులు, ముష్టిపాత మన నా గ్రైచెల్లు నేరంబు ల
త్యామోదం బొలయన్ క్షమించి గనుమయ్యా సన్ దయాంభోనిధీ

ఉ. ఈవిధి విన్నవించి తనయోగ్యత కెంతయు నేఁగునర్జునిన్
దీవన లొప్పఁగాఁ దెలఁచి దేహము నల్లెడఁ గల్పకల్లవ
శ్రీ వెలయించుహస్తమున జేర్చి వ్రణంబుల మాయఁజేసి, యా
శావసనుండు సజ్జనవశంవదుఁ డిట్టులు పల్కె వానితోన్. ౭౧

గీ. అహహ వోద్ధుర నీదుమూఁడవదియైన
యింతయపరాధమున నెంత సంతసంబు
గలిగెనో యంతహర్షంబు గలుగ దయ్య
భక్తిఁ దవమునఁ బూజాప్రసక్తినైన ౭౩

ఉ. ఆక్షణమందె శంకరుఁడు నమ్ములు చాపము మున్నుగాఁగఁ దాఁ
గుక్షినిగొన్నవానిఁ, దనఁ గోరినపాశుపతాస్త్ర మప్డ ప్ర
త్యక్షముగాఁ గిరీటివశ మందఁగఁజేసెను హర్ష మొప్ప, నా
దక్షునిగాండివాహితవిధంబున కిచ్చుబహూకృతిం బలెన్. ౭౪

# పాలకురికి సోమనాథకవి జన్మస్థలము

బండారు తమ్మయ్య

పాలకురికి సోమనాథుఁడు నన్నయ తిక్కనల నడిమి కాలమున వెలసిన ప్రఖ్యాతాంధ్రకవి. ఈతఁడు సంస్కృతభాషలో వేదవేదాంగాది సకలవిద్యాపారంగతుం డగుపండితుఁ డయ్యు గౌతమబుద్ధుఁడు ప్రాకృతమును బలె మతవాఙ్మయరచనమునకు మాతృభాష యగు తెలుఁగునే ప్రధానసాధనముగ గ్రహించి నిర్వహించిన మహనీయుఁడు. తెలుఁగుఁబలుకులను వేదములకొలఁదిగఁ దలపోయుఁ డని తెలుంగుసోదరుల హెచ్చరించి యసదృశనైపుణ్యముతో వేదార్థముల విరివిగ వెదఁజల్లుకృతులను జాటతెనుఁగున రచించి తెలుంగుఁదల్లిదీవనల వర్ధిల్లిన మురిపెంపుఁగొడుకుఁగుఱ్ఱ. "ఉరుతరగద్యపద్యోక్తులకంటె, సరసమై పరగినజానుతెనుంగు, చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ గూర్చెద ద్విపదలు గోర్కె దైవార" అనియు, "ఆరూఢగద్యపద్యాదిప్రబంధ, పూరితసంస్కృతభూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబుగామి, జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు" అనియు లోకమునకుఁ జాటి తాను జానుతెనుఁగురచనము ఁ వలచి యితరుల వలపింపఁ జేసి జాతీయచ్ఛందమగు ద్విపదలోఁ దనప్రధానకావ్యములను వెలయించిన సిద్ధంపుఁ దెలుంగుఁగవి యీతఁడు. ఆంధ్రత్వము నాంధ్రతేజము నాతనిదివ్యశరీరమున మూర్తీభవించి కవితాప్రవాహరూపమున నాతని కృతులయందెల్ల వెల్లివిరిసినది.

పాలసంద్రమునఁ జంద్రుఁడువోలె నీసుకవిసోముఁడు పాలకురికి యను జనపదమున నుదయ మందెను అది యాంధ్రచక్రవర్తుల రాజధానియై యాంధ్రనగరము, ఏకశిలానగరము నని వ్యవహరింపఁబడిన యోరుగంటికిఁ (Modern Warrangal) బండ్రెండుక్రోసుల దూరమున

నేఁటినిజామురాష్ట్రమున నల్లగొండజిల్లా జనగామతాలూకాలో నున్నది. పేరిలోఁ గొంత వికృతిని జెంది కొన్నిశతాబ్దులనుండి యిది పాలకురితి (పాలకుర్తి) యని కూడ వ్యవహరింపఁబడుచున్నను సోమనాథునికాలమున దీనికిఁ బాలకురికి యనియే వ్యవహారముండినట్లు సోమనాథుని కృతులవలననే విశదముకాఁగలదు. బసవపురాణ, పండితారాధ్యచరిత్రగద్యలలో "సుకృతాత్మపాలకురికిసోమనాథ । సుకవిప్రణీత —" అని యీతఁడు ప్రాసస్థానమునఁ బాలకురికి యనియే వ్రాసి యున్నాఁడు. తన కృతులలోని తక్కినతావులఁ గూడఁ దనయింటిపేరిని బేర్కొనుటలోఁ బాలకురికి లేక పాల్కురికి యనియే యుదాహరించినాఁడు. ఈతని శిష్యప్రశిష్యుఁడు పిడుపర్తి సోమనాథుఁ డీతని కంకితముగా రచించిన తన పద్యబసవపురాణావతారికలో

చ. అసదృశతన్మహామహిము మూరవితారకమై చెలంగ శ్రీ
బసవపురాణముం గ సకల భక్తకథామణి సూత్రభాతిగా
వెస రచియింపు మీవు పృథివీస్థలికిం జని నాఁగ భృంగి సం
తసమునఁ బుట్టెఁ బాల్కురికి నామపురీవరసోమనాథుఁడై.

అని యీతనిజన్మస్థలమును బాల్కురికి యనియే పేర్కొనినాఁడు. మనసోమనాథుని మఱియొక శిష్యప్రశిష్యుఁడు (నామము సరిగాఁ దెలియకున్నను నీతఁడుకూడ బహుశః పిడుపర్తివంశ్యుఁడే కాఁదగును) సోమనాథుని కంకితముగా రచించిన యన్యవాదకోలాహలమను సీసశతకములో సోమనాథునినెలవు పాలకురికి యనియే యుదాహరించినాఁడు.

సీ. భవదీయసంబంధ బంధురం బయ్యో నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
భవదంఘ్రిపూజనా పరుల కిమ్మయ్యె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి

యుష్మద్విహార సం యుక్తమై వెలసె నే
భాగ్యంబుచేసెనో పాలకురికి
యుష్మదీయాశ్రయా భ్యున్నతిం జెందె నే
భాగ్యంబుచేసెనో పాలకురికి
గీ. పాలకురికి యెట్టి భాగ్యంబుచేసెనో
నీస్వనామపూర్వనిహిత మయ్యె
నీహితానుషంగ! యేకాగ్రనుగురుచిత్త
నలినభృంగ! సోమనాథలింగ!

క్రీ॥ శ॥ 1560 ప్రాంతమునందుండి పిడుపర్తి సోమనాథున కించుక సమకాలీనుఁడయిన తోంటద సిద్ధలింగకవి (విరక్తతోంటదార్యుఁడు) కన్నడమున మనసోమనాథుని చరిత్రమును గూర్చి లిఖించినపాల్కురికి సోమేశ్వరపురాణమను కృతిలో ఆంధ్రదేశమున, శ్రీశైలమున కీశాన్యప్రదేశమునఁ గొలనుపాకకు సమీపముననున్న పాలకురికిలో సోమనాథుఁడు జన్మించె నని, కొలనుపాకయందు వెలసిన శ్రీ సోమేశ్వరస్వామి సేవనమునఁ దలిదండ్రులు కాతఁ డుదయించెనని స్పష్టముగ వ్రాసినాఁడు. ఇట్లు వర్ణింపబడినయీపాలకురికిలోఁ గొండపయి నొక శివాలయమున్నది. అందలి శివలింగమునకు సోమేశ్వరుఁ డనుపేరు సోమనాథుని పూర్వులాస్వామికిఁ బారంపర్యముగవచ్చెడి యర్చకులని తెలియుచున్నది. ఆస్వామివరప్రసాదమునసే సోమనాథుఁడు తలిదండ్రుల కుదయించెనని గూడఁ బాలకురికిప్రాంతమున వాడుకలో నున్నది. కావునఁ బాలకురికి సోమేశ్వరస్వామిపేరినిబట్టియో, కొలనుపాక సోమేశ్వరస్వామినామమును బట్టియో మనకవిజనకు లాతనికి సోమనాథుఁడని పేరు పెట్టియుందురు. ఆంధ్రులలో గ్రామనామములఁబట్టి గృహనామము లేర్పడుట చాలఁ బరిపాటి. కావునఁ బూర్వోక్తమయిన పాలకురికియనుగ్రామమును బట్టి యింటిపేరును పయిని జెప్పిన సోమేశ్వరస్వాములఁబట్టి నామమును మనకవివరున కేర్పడె నని తలంప నగును. పలువురు పరిశోధకు లీ

నిర్ణయము నంగీకరించి యున్నారు. కర్ణాటకవిచరిత్రకారులు శ్రీ నరసింహాచార్యులుగారు నిజామురాష్ట్రమందలి పాల్కురికియే సోమనాథుని నెలవని సంభావించిరి. "Kanarese Literature" అను గ్రంథములో E. P. Rice దొరవారు సోమనాథుఁడు గోదావరీప్రాంతము వాఁడను నుద్దేశముతో గోదావరిజిల్లాయందలి పాలకురికినివాసి యని వ్రాసి యున్నారు. నిజామురాష్ట్రమండలమున విశేషసంచార మొనర్చి పరిశోధనలు సలిపిన శ్రీ శేషాద్రిరమణకవులుగూడ రౌద్రిసంవత్సరమున ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో సోమనాథునిఁగూర్చి వ్రాసిన యొక చిన్నవ్యాసములో నాతనినెల వచ్చటిపాలకురికి యనియే వ్రాసిరి. ఆంధ్రపత్రిక దుందుభి సంవత్సరాదిసంచికలో వ్రాసిన "పాలకురికి సోమనాథకవి" అను వ్యాసములో నేనుకూడఁ బయినిర్ణయమునే చేసి యున్నాను. తరువాత నాంధ్రగ్రంథమాలికలోఁ బ్రకటితమయిన బసవపురాణము పీఠికలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కూడ దీని నంగీకరించిరి. ఆంధ్రులచరిత్ర వ్రాసిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు కూడ దీని నామోదించిరి.

ఇట్టి సందర్భములలో శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు పయి నిర్ణయములఁ బాగుగ నెఱింగియుండియు, ఆంధ్రగ్రంథమాలికలోఁ బ్రకటితమయిన పండితారాధ్యచరిత్రము (నూత్నముద్రణము) నకుఁ దాము వ్రాసినపీఠికలో నొక వింతపుంతను ద్రొక్కి మైసూరురాష్ట్రమునందలి తుముకూరుజిల్లా తిపుటూరుతాలూకాలోని "హాల్కురికె"యను ఎకారాంతనామగ్రామమును "హాలకురికి" యని యికారాంతముగా గ్రహించి యదియే సోమనాథుని జన్మస్థల మయియుండుననుని విపరీతవాదమును వెలువరించినారు. దీనికి ముఖ్యకారణములు పూర్వోక్తమయిన పాలకురికికి నేఁటికాలమున నిజాముప్రభుత్వమువారు ప్రకటించిన గ్రామనామములపట్టికలలో "పాలకుర్తి"యనుపేరేగాని "పాలకురికి" యనుపేరు

ప్రకటితము గాకుండుటయు, మైసూరు ప్రభుత్వము వారు ప్రకటించిన పట్టికలలో "హాల్కురికె" యను పేరు గానవచ్చుటయు, తెలుఁగునందలి 'ప'వర్ణము కన్నడములో 'హ'వర్ణముగా నుచ్చరింపఁబడుటచే నదియే సోమనాథుఁడు జననమందిన "పాలకురికి" యయియుండునని, "కురికి (కురికె)" ప్రత్యయాంతములగు గ్రామములు కన్నడదేశమునను నాంధ్రకర్ణాటదేశముల సరిహద్దులనుగాని యాంధ్రదేశమున లేవని, సోమనాథుఁడు కర్ణాటదేశమున జనించినవాఁడగుటచేతనే కర్ణాటకవులుం కూడఁ గొంద ఱాతని నుతించుటకుఁ గారణ మని శ్రీ నారాయణరావుగారు భ్రమించి తలంచుటయు నయియున్నవి. గ్రామనామములు ప్రకటితములయిన పట్టిపట్టికలుం మాత్రము తిరుగవేసి తక్కిన స్థలసన్నివేశములు, సంగతిసందర్భము లేమియు విచారింపకయే యొకశుద్ధాంధ్రకవి నెలవును కర్ణాటదేశమున నిరూపించుటయందలి యసామంజస్యము శ్రీ నారాయణరావుగారిబుద్ధికిఁ దోఁపకుండుట మిక్కిలి యక్కజ మని వేఱ చెప్పనక్కఱలేదు. నిజాముప్రభుత్వము వారి పట్టికలోని "పాలకుర్తి" నేఁడు కూడ నాప్రాంతమునఁ గొందఱచే "పాలకురికి" యనియే వ్యవహరింపఁబడుచున్నది. అచ్చటి సోమేశ్వరస్వామియాలయమందలి ధ్వజస్తంభము పయి "శ్రీపాల్కురికి సోమేశ్వరస్వామి" యని ప్రాచీనలిపిలోఁ జెక్కిన యక్షరములుంగానవచ్చును. సోమేశ్వరస్వామియాలయమే గాక సోమనాథుని సమాధిపయిని ప్రతిష్ఠిత మయినసోమనాథలింగము తదాలయము గూడ నీపాలకురికియందుండి పూజలొందుచున్నవి. పాలకురికి సోమనాథునిబంధువులు వంశ్యులు నని చెప్పికొనెడివారు, పాలకుర్తియందును దత్పరిసరములందును నిప్పుడుకూడ నివసించుచున్నారు. అచ్చటి సోమేశ్వర, సోమనాథలింగములకు వారే యర్చకత్వము నెఱపుచున్నారు. బసవపురాణావతారికలో "ఖ్యాతిమై సద్భక్తిగల కట్టకూరి, పోతిదేవర పదాంబుజషట్పదుండ" నని సోమనాథుఁడు కట్టకూరి పోతిదేవర యనునాతనిఁ దన గురువులలో నొకనిగాఁ బేర్కొనినాఁడు. ఈ పోతిదేవర

నివాసస్థలమగు కట్టకూరు పాలకురికి సమీపముననే యున్నది. సోమనాథుఁడు తన శిష్యులకు నగ్రహారముగా నిప్పించినట్లు పిడుపర్తి సోమనాథుఁడు పద్యబసవపురాణావతారికలోఁ జెప్పిన దోగిపర్తికూడ నీప్రాంతముననే యున్నది. జనుల వాడుకయందు నేఁడు "కుర్తి" యని యేర్పడిన రూపము పూర్వము "కురికి" యను రూపముతోఁ గూడ నుండినట్లు శాసనప్రమాణములు గూడఁ గలవు. పాలకుర్తి సమీపముననే నేఁడు ఎలకుర్తి, ఉఱుకుర్తి యను పేళ్లతో వ్యవహరింపఁబడు గ్రామములు పదిరెండు, పదిమూఁడు శతాబ్దులనాఁటి శాసనములలో "ఎలకురికి" ఉఱుకురికి యను రూపములతోనే వాడఁబడి యున్నవి.

కాకతిరుద్రదేవునినాఁటి ధర్మసాగరము శాసనము (నాలుగవవైపు ౧౨, ౧౩, ౧౪ పంక్తులు).

"రెండుపాళ్లు ఎలుకుర్కి ప్రసన్నవిశ్వేశ్వరదేవరకు సమర్పించినసందుల వినియోగము భోగములు"

కాకతి గణపతిదేవునినాఁటి కొండిపర్తిశాసనము (శా. శ. ౧౧౩౬) తూర్పువయిపు 38-40 పంక్తులు.

"(శ్రీ) చౌండ సైన్యపతి రారపించు తారం గ్రామం సమగ్రమన ...... న్నలుకుర్కి సన్నిధం.

(తెలంగానా శాసనములు)

ఈవిషయముల నెల్ల (శ్రీ) నారాయణరావుగారు పండితారాధ్యచరిత్రపీఠిక వ్రాయునప్పటికి బాగుగా గుర్తించియున్నచో వారీవింతనిర్ణయమునకుఁ బూనుకొనియుండరనియే విశ్వసించెదను.

పిడుపర్తి సోమనాథుఁడు పద్యబసవపురాణావతారికలో నొకనాఁ డోరుగంటిలో స్వయంభూదేవుని యాలయమున భక్తులు పాలకురికి సోమనాథుని బసవపురాణమును జదువుచుండఁగాఁ గాకతిప్రతాపరుద్రుఁడచ్చటికి వచ్చె ననియు నాతఁ డవియేమని ప్రశ్నింపఁగా ధూర్తవిప్రుఁ

డొకఁడు పాలకురికి సోమపతితుఁడు వ్రాసినట్లు, వెట్టియ ప్రమాణముగా నూతనముగ రచించిన ద్విపదబసవపురాణమని చెప్పి నిందింప భక్తులీవార్త సోమనాథునియొద్ద కేఁగి విన్నవింపఁగా నతఁడు ప్రతివాదుల జయింప నోరుగంటికి కేతెంచి మహిమలు ప్రదర్శించి శత్రులకుఁ దలవంపులు ఘటించి ప్రతాపరుద్రుని పూజలఁ గ్రహించెనని వ్రాసియున్నాఁడు ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రము, తుమ్మలపల్లి నాగభూషణకవి బసవవిజయమునందుఁగూడ నీకథ యుగ్గడింపఁబడినది. సోమనాథుని నెలవు పాలకురికి యోరుగంటిప్రాంతమున నున్నప్పుడే యిట్టికార్య మాదినములలో జరిగియుండుట కనువుగా నుండునుగాని మైసూరురాష్ట్రస్థమగు "హాల్కురికె" యందు సోమనాథుఁ డున్నచో నట్టిది జరగియుండదు. కావున నెన్ని విధములఁ జూచినను నిజామురాష్ట్రమునందలి పాలకురికియే సోమనాథుని జన్మస్థలమని నిస్సంశయముగ నిర్ణయింపనగును.

మైసూరురాజ్యమందలి హాల్కురికెయందు సోమనాథసంబంధికములగు సన్నివేశము లొక్కటియుఁ గానరావు. ఉన్నట్లు శ్రీనారాయణరావుగారైనను జెప్పనేరరు. అది శుద్ధకర్ణాటదేశము. పూర్వము వర్తకమునకై వలసవచ్చిన కొన్ని వైశ్యకుటుంబములవారు మాత్రము వచ్చియుండిరి. కొన్నాళ్ళకుఁ దెలుఁగు మాట్లాడుట గాని యిచ్చట నేఁడు తెలుఁగుబాస మాటాడువారే లేరని తెలియుచున్నది. ఇప్పుడు లేకున్నను పూర్వ మచ్చటఁ దెలుఁగువా రుండిరని తెలుఁగుబాస ప్రచారముం గుండెనని శ్రీనారాయణరావుగారు తలంచిచో నదివట్టిభ్రమయే యని చెప్పఁదగును. ఆంధ్రదేశపుఁ బొలిమేర యచ్చటికి నలువదిమైళ్ళదూరమునఁ గాని లేదు. సోమనాథునిఁ గర్ణాటకవులు కొందఱు నుతించుటకుఁ గల వాస్తవకారణమును శ్రీనారాయణరావుగారు గుర్తింపకుండుట శోచనీయము. ఉపలబ్ధములయిన సోమనాథునికృతులలోఁ గేవలము కర్ణాటకృతియని చెప్పఁదగిన సుప్రసిద్ధకావ్య మొకటియుఁ గానరాదు. కర్ణాటకవులయినను నట్టికృతిని దేనిని పేర్కొని యుండలేదు. సోమనాథుని వారు

సన్నుతించుటకుఁ గలప్రధానకారణ మాతఁడు పుట్టుకచేఁ గర్ణాటుఁడను కర్ణాటకావ్యకర్తయై ప్రసిద్ధి నొందియుండుటగాదు. మఱి కర్ణాట దేశీయుఁడు వీరశైవమతోద్ధారకుఁడునగు బసవేశ్వరుని చరిత్రమును మహిమాదికములను దొలుదొలుతఁ దనమాతృభాషయగు తెలుఁగున వెలయించి తెలుఁగువారికిఁ గన్నడులకుఁ గూడ నేకరీతిగ నుపకరించు బసవస్తోత్రము లనేకములు రచించి, సోమనాథుఁడు బసవపురాణమును బసవస్తవములను గన్నడమునఁ గూడ వెలయించుటకుఁ దమకు మార్గదర్శకుఁడయిన మహనీయుఁ డనియే యాతనియెడ భక్తిని బ్రదర్శించి కర్ణాటకవులు గొంద ఱందునను ముఖ్యముగ వీరశైవకవులుమాత్రమే యాతనిఁ దమకృతులలోఁ బ్రశంసించిరి.

శ్రీ నారాయణరావుగారి యీనూత్నవాదమును విభూతిపత్త్రికాధిపతులు శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు విభూతి సం 2 సం 1 యందును, "బసవపురాణము; తత్కృతివిశేషములు" (విభూతి సం 4 సం 1) అనువ్యాసమున శ్రీ శేషాద్రి రమణకవులును విమర్శించి యున్నారు. ఇతరత్ర మఱికొందఱుగూడ దానిని నిరసించిరి. శ్రీనారాయణరావుగా రిందులో వేనికిఁ దగుసమాధానము లొసంగక శ్రీవీరభద్రశర్మగారికి నివేదనపూర్వకముగ భారతి సం 20 సం 7 లో "పాల్కురికి" యను శీర్షికతో నొకచిన్నలేఖనుమాత్రము ప్రకటించిరి. దానిలోఁ దమ "హాలకురికి" వాదము కేవలము నూత్న మనియు, పాల్కురికి గ్రామనామవిచారమే క్రొత్తదనియు సత్యమని తోఁచుటచేతనే దానిని బ్రకటించితిమనియు, హాల్కురికియందు జనించినను సోమనాథుని శైవమతప్రచారము శ్రీశైలము, ఓరుగల్లుప్రాంతముల జరిగిన దని తాముకూడ నంగీకరించితి మనియు, హాలకురికిప్రాంతమున నిప్పుడు తెలుఁగు బాస విశేషవ్యవహారములో లేకున్నను బూర్వ ముండియుండు ననియు, హాలకురికె ప్రాంతకన్నడశాసనములలో "పాల్కురికె" యని తెలుఁగు

శాసనములలోఁ బాల్కురికి యని పేర్కొనఁబడిన దనియు వ్రాసి యట్టి
శాసనప్రమాణము మాత్ర మొకటియు నుదాహరింపరయిరి. ఇంతతో
నూరకొనక పాలకుర్తియే పాలకురికి యను నిశ్చితవాదమును మొదటఁ
బ్రవేశ పెట్టినది నే ననియు నామాటలందలి విశ్వాసముచే వానిని సమ
ర్థించుటకయి శ్రీ వీరభద్రశర్మగారు తమ పాలకురికి వాదమును ఖండిం
చుటకయి ప్రయత్నించి రనియుఁ గూడ శ్రీ నారాయణరావుగారు వ్రాసి
యున్నారు. ఇవి కేవలము సాహసవాక్యము లని తెలుపుటకు విచార
మగుచున్నది. ఓరుగంటి ప్రాంతముననున్న సోమనాథుని పాలకురికి
నేఁడు పాలకుర్తి యని నిజాము రాష్ట్రమున వ్యవహరింపఁబడుచున్నట్లు
ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో సోమనాథుఁగూర్చి వ్యా
సము వ్రాయునప్పటికి నాకుఁ దెలియనే తెలియదు. ఆటుతరువాతనే
దాని నే నెఱింగితిని. ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రములో "పాలకుర్తి"
"పాలకుర్తి సోమనాథుఁ" డనియే యున్నది. కావునఁ బాలకురికికి "పాల
కుర్తి" యను వ్యవహారము నూతనముగఁ గాక కొన్నిశతాబ్దుల క్రింద
టనే యేర్పడి యున్నట్లు తలంప నగును.

క్రీ. శ. 15[illegible]0 ప్రాంతముననున్న తోంటదార్యుఁడు, పిడుపర్తి
సోమనాథుఁడు మొదలుకొని నేఁటివఱకు నాంధ్రకర్ణాటకవులు నాధునిక
విమర్శకులు ఓరుగంటిప్రాంతమందలి పాలకురికి (పాలకుర్తి) నే సోమ
నాథుని నెలవుగా సంభావించి యున్నట్లు లింతకుముందే వివరించియుం
టిని. ఇట్టి పరిస్థితులలో సత్యమును గప్పిపుచ్చి శ్రీ నారాయణరావు
గారు పాలకుర్తియే పాలకురికియను నిశ్చితవాదమును లేవనెత్తినది నేనే
యని వ్రాయుట యెంతఘోరసాహసమో విజ్ఞులకుఁ జెప్ప నవసరము
లేదు. ఇప్పటివఱకుఁ దామొక్కరు దక్క మఱెవ్వరయిన పాల్కూరికెను
సోమనాథుని జన్మస్థలముగా నెంచినట్లు శ్రీ నారాయణరావుగారు చూ
పఁగల్గినచో జోహారులు. తమది కేవలము నూత్నవాద మని తామే చెప్పి
కొనుచు నిట్టి యసంగతవాక్యములు వ్రాయుటలోఁ బ్రయోజనమేమి?
తృతీయపంథగా నొక నూత్నవాదమును బ్రకటించు నభిలాషముతోడనే
నామిత్రులు శ్రీ నారాయణరావుగారు ఎకారాంతరూపము నికారాంత

ముగా మార్చి క్రొత్తగా పాల్కురికి వాదమును వెలువరించినట్లు విజ్ఞులు గ్రహింపకపోరు.

హాల్కురికె యేశాసనమందయినను పాల్కురికె యనిగాని పాల్కురికి యనిగాని వ్యవహరింపఁబడినను నది శ్రీనారాయణరావుగారి వాదమున కుపకరింపఁజాలదు. ఏకనామముగల గ్రామములు భిన్నభిన్న దేశములలో మండలములలో నిప్పుడుగూడ ననేకములు గానఁగును. కొన్ని యెడల నొక్క జిల్లాలో నొక్క తాలూకాలో నేకూడ నిట్టి యేకనామక గ్రామములు గానవచ్చును. కావున పాలకురికియను గ్రామములు వేర్వేఱుతావులఁ గానవచ్చినను వాస్తవముగా వానిలో నేది సోమనాథుని జన్మస్థలమో శృంగగ్రాహికాన్యాయమున నిర్ణయించి నిరూపించుటయే చరిత్రజ్ఞుల కర్తవ్యము స్థలసన్నివేశాదిసామగ్రిచే నోరుగంటి ప్రాంతమందలి పాలకురికి (పాలకుర్తి) నే యట్లు నిరూపించుటకు వలసినన్ని యవకాశము లున్నవి.

శ్రీ వీరభద్రశర్మగారు పూర్వోక్తమయిన "హాల్కురికె"ను 22-3-43 తేదిని స్వయముగా సందర్శించి యచ్చటి విశేషములఁ గూర్చి వారి పూర్వోక్తవిమర్శనానంతరము విభూతి సం. 4 సం. 7-8-9 లో "హాల్కురికె" యను శీర్షికతో మఱియొక వ్యాసమును బ్రకటించియున్నారు. దానిని జదివినవారికి శ్రీ నారాయణరావుగారి వాదమందలి యసామంజస్యము మఱింత వ్యక్తము కాఁగలదు. ఈ గ్రామము తాలూకా గ్రామమగు తిపటూరునకుఁ దొమ్మిదిమైళ్లదూరమున నున్నది. అచ్చట రమారమి నాలుగునూఱులు గృహములును వేయిమంది జనులును గలరు. జనసంఖ్యలో ముక్కాలువీరశైవులు. వారి యందఱభాషయుఁ గన్నడమే. అచ్చటి జనులలో వీరశైవులకుఁగూడ నెవరికిఁ బాల్కురికి సోమనాథునిపే రైన నెఱుంగరాదఁట. గ్రామమున రెండువందలయేండ్ల క్రిందట నిర్మింపఁబడిన శివాలయ మొక్కటియే కలదు. ఫలహారేశ్వర, రుద్రదేవర, భైరవేశ్వర యనునామములుగల మూవురుమూర్తు లాదేవళమునఁ గలరు. అనఁగా సోమనాథుని కాలమునాఁటి కచ్చట శివాలయ మైనను లేదు.

ఈగ్రామము శా. శ. ౧౪౬౮ సంవత్సరములో వీరసదాశివరాయలవారిపక్షమున రామరాయలచే మాధ్వసంప్రదాయాచార్యులగు సోసలెవ్యాసరాయస్వాములవారి కగ్రహారముగా నీయఁబడినట్లు లోకమాధ్వమఠమున కెదురుగానున్న కన్నడశిలాశాసనములో నున్నది. అందు గ్రామనామము హాల్కురికె యనియే యున్నట్లు తెలియుచున్నది. కురికె యను ఎకారాంతరూపములు కన్నడదేశమునను, కురికి యను ఇకారాంతరూపము లాంధ్రదేశమునను వ్యవహృతము లయినట్లు దీనినిబట్టి గ్రహింప నగును.

పరమపూజ్యుఁడగు సోమనాథుని జన్మస్థానమగు పాలకురికి యాంధ్రభాషాభిమానుల కెల్లఁ బూజ్యపద మగునొక దివ్యక్షేత్రమై యలరారుచున్నది. హైదరాబాదు వైపునుండి వచ్చువారు జనగాంస్టేషనువద్దను బెజవాడవైపునుండి వచ్చువారు ఘనపురము (Ghanpur) స్టేషను వద్దను దిగి మైదాలుమైళ్లు మోటారుమీఁదను, తరువాత రమారమి పదునేను మైళ్లు రెండెడ్లబండిమీఁదను బ్రయాణము చేసి పాలకురికిని జేరవచ్చును. నేఁడిది చిన్నగ్రామ మైనను "కొంచెమైన నదియుఁ గొదవగాదు" అను వేమనసూక్తికి దావలమై క్షేత్రమహాత్మ్యమున గొప్పదిగనే గణింపఁ బడుచున్నది. అచ్చటి కొండపై నున్న సోమేశ్వరస్వామియాలయమునుండి చూచినచో రెండుమైళ్లదూరములో మహాకవి పోతనామాత్యుని జన్మస్థానమగు బమ్మెరగ్రామముగూడఁ గానవచ్చును. సోమేశ్వరస్వామియెదుట శిల్పకళాసంపదమెఱయు ప్రాచీన నీలనందీశ్వరవిగ్రహము గూడఁగలదు. మహాశివరాత్రి కేఁటేఁట నచ్చట గొప్పయుత్సవము జరుగును. అప్పుడాయుత్సవములో యాత్రికులు "పాలకుర్తి నిలయా! సోమయలింగా! పాదములకు శరణు! ఉరవుగ బమ్మెర పోతరాజుకు మీరు కోరినవరములు కృపచేసినారఁట! పాలకుర్తి నిలయా" అను పాటను బాడుచుందురు. దీనినిబట్టి సోమేశ్వరస్వామి పోతనామాత్యునకుఁ గూడ నిష్టదైవముగా నుండె నని మనము గ్రహింపనగును. ఆంధ్రదేశమునెల్ల భక్తిరసప్రవాహమున నోలలాడించు నిరువురు సుప్రసిద్ధమహాకవులను బ్రసాదించిన యీసోమేశ్వరస్వామిని సందర్శించి సంసేవించుట యాంధ్రమహాశయుల కత్యంతావశ్యకము.

సోమేశ్వరాలయము మున్నకొండకుఁ దూర్పునఁ గొంతసమీపము ననే సోమనాథకవి సమాధిగలదు. దానిపై సోమనాథలింగము ప్రతిష్ఠింపఁబడి చిన్నగుడి యొకటి నిర్మింపఁబడి యున్నది. దీనిని సోమనాథాలయమనియు సోమనారాధ్యాలయ మనియు వ్యవహరింతురు. ఈయాలయమున ధ్వజస్తంభము నొద్ద జపలు, రుద్రాక్షలు, హృదయభాగమున హస్తాంబుజద్వయముతోఁ బూజించు శివలింగము గలశిలావిగ్రహ మొకటి కలదు. దాని దిగువను ప్రాఁత లిపిలోఁ బేరుకూడ లిఖింపఁబడి మిక్కిలి యరిగిపోవుటచే సరిగాఁ దెలియక "సో, నా," అను రెండక్షరములు మాత్రము పోల్పఁదగి యున్నవి. ఇది సోమనాథకవి విగ్రహమే యని గుర్తింపఁదగును. సోమనాథలింగము విశేషమహిమాన్వితమై భక్తులకు, విపన్నులకు, రోగగ్రస్తులకుఁ గామ్యార్థులకు యాత్రాస్థానంగమై యొప్పుచున్నది. చుట్టుప్రక్కలఁ బది యిరువదామడల దూరము నుండి నిచ్చలు నిచ్చటికి యాత్రికు లరుదెంచు చుందురు. వారియుపయోగమునకై యాలయసమీపమున వసి, వసనేసు ధర్మశాలలుగూడ నిర్మింపఁబడి యున్నవి. ఇచ్చటిరోగనివారణాదిక మహిమలకు సోమనాథుని యంత్రపురశ్చరణ, అష్టదిగ్బంధము మొదలగు క్రియాసిద్ధులు కారణము లని చెప్పుదురు.

సోమేశ్వరస్వామి యాలయమున్న కొండక్రింది సానువులలో పెద్దతేనెపట్టులు ముప్పదియారు నిత్యము ప్రత్యక్ష మగుచుండును. ఆలయమున కెవరైన నశుచిగా వచ్చినచో నచ్చటి తేనెటీఁగలు వారిపై దాడివెడలి యెంతదూరము పరుగిడినను విడిచిపెట్టవు. కాని సోమనాథాలయము సన్నిధికిమాత్రము వెళ్లుచో నచ్చటికవి ప్రవేశింపఁ జాలవు. ఇట్లు పెక్కు మహిమలతోఁ గూడిన సోమేశ్వర, సోమనాథలింగముల సందర్శించుటకయి యాంధ్రభాషాభిమానులు జన్మమున నొకపరియైనఁ బాలకురికియాత్ర గావించి ధన్యులయ్యెదరుగాక !

సరియైన పరిశోధనము నన్వేషణము జరిగినచో నీపాలకురికియందును దత్ప్రాంతమునను నలభ్యములగు సోమనాథుని కృతులును నితర చారిత్రక సామగ్రియుఁ గూడ లభింపఁ గల వని తలంపఁదగును

# దర్శనసమీక్ష.

సాహిత్యశిరోమణి, భాషాప్రవీణ, చిలుకూరి వీరభద్రశాస్త్రి

‘దర్శన’ శబ్దమునకుఁ బ్రకరణవశమున నాయాస్థలముల భిన్నార్థము లున్నను నీప్రస్తావమునఁ ‘దృశ్యతే జ్ఞాయతే ఆత్మా అనేన’ యను వ్యుత్పత్తిచేఁ జేతనవస్తువులవిషయమగు విమర్శనమే ప్రధానముగాఁగల యాగమము (శాస్త్రము) అను నర్థమును గ్రహింపవలయును.

దర్శనముల సంఖ్యానిర్ణయమునుగుఱించి పెద్దలు పలువిధములగు నభిప్రాయభేదములను బ్రకటించియున్నారు. కొందఱు ౧. పూర్వమీమాంస ౨. ఉత్తరమీమాంస, 3. సేశ్వరసాంఖ్యము ౪. నిరీశ్వరసాంఖ్యము, ౫. సప్తపదార్థాభిధాయిన్యాయము (వైశేషికము) ౬. షోడశపదార్థాభిధాయిన్యాయము (నైయాయికము) అను నీయాఱిటిని షడ్దర్శనములుగా నంగీకరించిరి. ఈక్రిందిశ్లోకము దాని కుపష్టంభకము.

శ్లో. కపిలస్య కణాదస్య గౌతమస్య పతంజలేః,
వ్యాసస్య జైమినే శ్చాపి శాస్త్రాణ్యాహుః షడేవహి.

ఇఁకఁ గొందఱు 1. మీమాంసాదర్శనము, 2. సాంఖ్యదర్శనము, 3. న్యాయదర్శనము, 4. బౌద్ధదర్శనము, 5. జైనదర్శనము, 6. చార్వాకదర్శనము, అనువానిని షడ్దర్శనములుగా నంగీకరించిరి.

మఱికొందఱు (బౌద్ధాంతర్గత) 1. సౌత్రాంతిక, 2. వైభాషిక, 3. యోగాచార, 4. మాధ్యమిక, 5. జైన, 6. లౌకాయతికము, లనెడి యాఱుదర్శనములును, 1. పూర్వమీమాంస, 2. ఉత్తరమీమాంస, 3. సేశ్వరశాంఖ్య, 4. నిరీశ్వరశాంఖ్య, 5. న్యాయ, 6. వైశేషికము లనియెడి యాఱుదర్శనములును గలిపి ద్వాదశదర్శనములుగా నంగీకరించిరి.

౧ చార్వాకము ౨ జైనము ౩. వైభాషికము ౪. సౌత్రాంతికము ౫. యోగాచారము ౬. మాధ్యమికము ౭. నైయాయికము ౮. వైశేషికము ౯. పాశుపతము ౧౦ సాంఖ్యము ౧౧. యోగము ౧౨. భాట్టము. ౧౩. ప్రాభాకరము ౧౪. మాయావాదము ౧౫. భాస్కరీయము ౧౬. యాదవము ౧౭. ఏకాయన (మాధ్వము) ౧౮. విశిష్టాద్వైతము, అని దర్శనములను పదునెనిమిదిగా నుగ్గడించువారును గలరు.

శ్రీసాయణ మాధవాచార్యులు, 1. చార్వాకదర్శనము, 2. బౌద్ధదర్శనము, 3. ఆర్హతదర్శనము, 4. రామానుజదర్శనము, 5. పూర్ణప్రజ్ఞదర్శనము, 6 నకులీశపాశుపతదర్శనము, 7. శైవదర్శనము, 8. ప్రత్యభిజ్ఞాదర్శనము, 9. రశేశ్వరదర్శనము, 10. ఔలూక్యదర్శనము, 11. అక్షపాదదర్శనము, 12. జైమినిదర్శనము, 13. పాణినిదర్శనము, 14 సాంఖ్యదర్శనము, 15. పాతంజలదర్శనము, 16. శాంకరదర్శనము, నని దర్శనసంఖ్యావిషయమై పదునాఱుగా నిరూపించియున్నారు. వీనితోపాటు బౌద్ధమునఁగల 1. మాధ్యమిక, 2. యోగాచార, 3. సౌత్రాంతిక, 4. వైభాషిక, మనుభేదచతుష్టయమును గ్రహించితిమేని పందొమ్మిది దర్శనము లగును

సాధారణముగ దర్శనములు రెండు తెఱఁగులుగాఁ గన్పట్టుచున్నవి. (జీవునకు నీశ్వరునకు) అభేదమును దెల్పునవియు, భేదమును దెల్పునవియు నని. వీనిలో నభేదప్రతిపాదకత్వమున నగ్రస్థానమును వహించినది శాంకరదర్శనము. పాణినిదర్శనమును, అభేదప్రతిపాదక మనియే పెద్దలయుద్ఘోషము

శ్లో. వాచ్యా సా సర్వశబ్దానాం శబ్దాచ్చ నపృథక్తతః ।
అపృథక్త్వేఽపి సంబంధస్తయో ర్జీవాత్మనోరివ.

వాచ్యవాచకముల (పదపదార్థముల) కభేదము నిత్యమయినను వానికిసంబంధము (భేదము) కేవలము కల్పింపఁబడినదగుటచే నది జీవా

త్మపరమాత్మల కభేదము సత్యమయియున్నను వ్యవహార కాలమునఁ గల్పనావశముచేఁ గలిగినసంబంధము (భేదము) వలె స్థిరము కానేరదు.

శ్లో. తస్మాచ్ఛక్తివిభాగేన సత్యః సర్వః సదాత్మకః
ఏకోఽర్థః శబ్దవాచ్యత్వే బహురూపః ప్రకాశతే.
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి.

ఇటు లీదర్శన మభేదప్రతిపాదక మయినటులనే మీమాంసా (పూర్వమీమాంసా) దర్శనముగూడ నభేదమును దెలుపును. కావునఁ బైనఁజెప్పినరీతిని శాంకర పాణినీయ మీమాంసా దర్శనములు మూఁడు నభేదప్రతిపాదకములు. మిగిలిన దర్శనము లన్నియు (జీవేశ్వరులకు) భేదమును దెలుపునవి.

ఏదర్శనము లభేదమును జెప్పునో యయ్యవి 'శ్రౌత'ములని చెప్పనగును. శ్రుతులనే ప్రధానప్రమాణముగాఁ గొని వస్తుయథార్థస్వరూపమును బ్రతిపాదించునవి 'శ్రౌతములు'. ఏదర్శనములు భేదమును దెలుపునో యయ్యవి 'తార్కికములు'. ప్రధానముగాఁ దర్కము (ఊహ=అనుమానము)నే యాధారముగాఁగొని వస్తుస్వరూపమును వెదకునవి 'తార్కికములు'.

వేఱొకరీతిని 'నాస్తికము'లనియు 'ఆస్తికము'లనియు దర్శనములు రెండువిధములు. దైవము, పరలోకము, మున్నగునవి లేవనియెడివాదమును దెలుపునవి 'నాస్తికములు'. అవి యున్న వని తెలుపునవి 'ఆస్తికములు'. దర్శనములలో చార్వాకము, భేదచతుష్టయముతోఁగూడిన బౌద్ధము, ఆర్హతము (జైనము) ననునవి నాస్తికదర్శనములు. మిగిలిన పదుమూఁడును ఆస్తికములు.

బ్రహ్మ మొదలిడి స్తంబపర్యంతముగల సమస్తప్రాణిజాతము సహజముగా ననిష్టమును దొలంగి యిష్టమును బొందుట కిచ్ఛగించుననుట యెల్ల రెఱిఁగినదియే. ఇయ్యదిదర్శనకర్తల కెల్లరకుసమ్మతిపాత్రము.

అం దిష్టతమ మాత్యంతికసుఖము. అయ్యదియె మోక్షము. అదిజ్ఞానము చేతనే సాధింపఁదగినది. 'జ్ఞానాదేవహికైవల్య'మ్మనియభియుక్తోక్తిగదా. 'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే' యనిగీతలో జ్ఞానమాహాత్మ్యమును కృష్ణభగవానుఁ డుద్ఘోషించియున్నాఁడు. లోకమునం దొక్కొకతఁడే జ్ఞాని పెక్కుయత్నములు సల్పియు సాధింపఁజాలని ప్రయోజనమును మందుఁడు సైతము ధనముకలిమి ననాయాసమున సాధింపఁగల్గును. అంతమాత్రమున కాతఁడు జ్ఞానికంటె నధికుఁ డనఁజెల్లదు. ద్రవ్యము నేదియో యొకయుపాయముచే మనుజుఁడు సాధింపఁ గలుగును జ్ఞానము మాత్ర మట్టిది కానేరదు.

కావుననే కరదీకృతసకలసామంతమండలుఁడును, ఐశ్వర్యశిఖరారూఢుఁడును, ఏకాదశాక్షౌహిణీయుతుఁడును నగుదుర్యోధనుఁడు పరాభూతుఁ డగుటయు, రాజ్యభ్రష్టులయ్యుఁ బదుమూఁడువత్సరము లీవనమునుండి యావనముకుఁ గ్రుమ్మఱుచు నవయు పాండవులు తమజ్ఞానముచే సంతోషితకృష్ణులయి తత్సాహాయ్యముకల్మిఁ దుదిగెలుపు గొనుటయుఁ బైవిషయమునకు దృష్టాంతము. ద్రవ్య మున్నచో బుద్ధికి సాహాయ్యకారి యగునుగాని జ్ఞానముకంటె దానికిఁ బ్రాధాన్యము లేదనువిషయము సార్వజనీనము. తత్త్వవిషయకమగు ఆత్మానాత్మ విషయకమగు తెలివియే 'జ్ఞాన' మనఁబడును, 'తస్య భావ స్తత్త్వ' మనువ్యుత్పత్తిచే వస్తువునకుఁ గలయథార్థస్వరూపమే 'తత్త్వ' మనఁ బడును. వస్తుతత్త్వజ్ఞానమే మోక్షోపయోగి. కావున దేనిని దెలియుట మోక్షము (ఆత్యంతిక సుఖము) న కుపయుక్తమో యయ్యది 'తత్త్వ'మని మన కొకలక్షణము తెలియుచున్నది. అట్టి తత్త్వములను దెలిసికొనుటవలనఁ గలిగెడు దుఃఖాసంవలితసుఖము (మోక్షము) ఆయాయిదర్శనకర్తలప్రతిభావిశేషముల నాశ్రయించి ప్రతిదర్శనమునందు భిన్నముగాఁ జూపట్టుచున్నది. దర్శనకర్తలు వేఱగుటవలన, వారు చూపెడిసుఖావస్థ, దానికి సాధన

మగుజ్ఞానము, జ్ఞానమూలమగు తత్త్వములు వేఱుగాఁ గన్పట్టుచున్నవి. అందుచే దర్శనములుగూడ భిన్నముగా నేర్పడినవి.

ఇట నాయాసర్వదర్శనములందుఁ గలవిషయము, స్వరూపము, మొదలగునవి సంక్షేపముగా నాయోపికకొలఁది వివరించుచుంటిని.

### చార్వాకదర్శనము.

నాస్తికాగ్రేసరుఁడగు చార్వాకునిచే రచింపఁబడిన దర్శనము చార్వాకదర్శనము. వీరిమతమున- త్వగింద్రియముచే మృదువు, కఠినము, శీతము, ఉష్ణము మొదలగు ననుభవములు పొందుట; జిహ్వచే కారము, పులుసు, తీపి మొదలగు రసములానుట; ఘ్రాణేంద్రియముచే కస్తూరి, కుంకుమ మొదలగు పరిమళద్రవ్యములకుఁ గల సౌరభ మాఘ్రాణించుట; నేత్రములచే ఘటము, పటము, స్తంభము, అంభోరుహము మొదలగు స్థావరాదిజంగమాంతపదార్థములను జూచుట; శ్రవణేంద్రియముచే వీణానాదము, స్త్రీగీతము మున్నగుమధురధ్వనులు వినుట; దేనివలనఁ గలుగునో యట్టి ప్రత్యక్ష మొక్కఁడే ప్రమాణము. అనుమానము, శబ్దము మొదలగు ప్రమాణము లనభిమతములు. అప్రత్యక్షమగు పరలోకము వీరి కక్కఱలేదు. వేదచోదితధర్మ మసమ్మతము. పుణ్యమగణ్యము. పాపము శూన్యము. అనుమానప్రమాణముచే సాధింపఁదగిన యీశ్వరుఁడును లేఁడు. లోకమునఁ గన్నుల కెదురుగఁ గన్పడు మేదినీశ్వరుఁడే యీశ్వరుఁడు. దేహమే యాత్మ. దేహపాతమే మోక్షము. లలితకాంతాలింగనాది విషయోపభోగమే పురుషార్థము. ముల్లు గ్రుచ్చుకొనుట మున్నగువానివలనఁగలుగు దుఃఖమే నరకము.

కావున నెల్లరు ఖాద్యాఖాద్య, గమ్యాగమ్య, సేవ్యాసేవ్య వివేకము లుజ్జగించి తమకుఁ దగినరీతిని యథేచ్ఛముగా విషయసుఖము సంపాదించుకొనవలయు ననునది యీమతమందలి సారాంశము.

శ్లో. యావ జ్జీవే త్సుఖం జీవేత్ ఋణం కృత్వా ఘృతం పిబేత్,
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః.

ఈమతము వినుటకు వీనుల కింపుగాఁ గన్పట్టినను దుదికి దుఃఖావహమగుటచేతను, పెద్దలచే నంగీకరింపఁబడనిదగుటచేతను గ్రాహ్యము కాదు.

శ్లో. న స్వర్గో నైవ జన్మాన్యపి న నరకో నాప్యధర్మో నధర్మః
కర్తా నైవాస్య కశ్చిత్ ప్రభవతి జగతో నైవ భర్తా న హర్తా
ప్రత్యక్షాన్యన్న మానం న సకలఫలభుక్ దేహభిన్నోఽస్తి కశ్చిత్
మిథ్యాభూతే సమస్తే హ్యనుభవతి జన స్సర్వ మేతద్ధి మోహాత్.

## బౌద్ధదర్శనము.

బుద్ధదేవు ననుసరించువారు బౌద్ధులు. వారు రచించిన దర్శనము బౌద్ధదర్శనము. వీరు 1 మాధ్యమికులు, 2 యోగాచారులు, 3 సౌత్రాంతికులు, 4 వైభాషికులు, అని నాలుగు తెఱఁగులవారు. అందు—

### మాధ్యమికులు.

మొదట బుద్ధదేవుఁడు తనశిష్యులకు 'సర్వము శూన్యము' అని యుపదేశము చేయ నెవరు గురూపదిష్టమగు సర్వశూన్యత్వమును సత్యముగా నమ్మి యిఁక నేమియు నడుగరైరో వారు మధ్యమబుద్ధి కలవారగుటచే 'మాధ్యమికు' లనఁ బరగిరి. వీరిది క్షణికవాదము. ప్రతివస్తువు క్షణమాత్రమే నిలుచును. కావున చిరస్థాయి కాదు. ప్రతివస్తువు దుఃఖము నిచ్చునదియే కావున ననుకూల (వేదనీయ)ము కాదు. ప్రతివస్తువునకు దాని కున్న రూపమే లక్షణము. కావున సామాన్యముగా నుండు (అనఁగా బ్రాహ్మణుఁడని తెలిసికొనవలయునన్న శిఖాయజ్ఞోపవీతములు బ్రాహ్మణు నెఱింగించును. అగ్నిహోత్రుని తెలిసికొన వలయునన్న కాల్చువాఁడు, వేఁడిగా నుండువాఁ డగ్నిహోత్రుఁ డనుగుర్తుచేఁదెలియ నగును.) లక్షణ ముండనేరదు. ప్రపంచమంతయు శూన్యము. (ఏమియు లేదు.) కావున నేవస్తువు సత్యముకాదు. ఇటులు బుద్ధోపదిష్టమగు శూన్యత్వము నవలంబించినవారగుటచే వీరలు 'సర్వశూన్యవాదులు'.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురంమహారాజావారు, పరిషచ్ఛాశ్వతాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు - ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు,
(కోశాధ్యక్షు .)

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

,, కోటా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

,, అడ్డాల రామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారధిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు రామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రశాస్త్రిగారు, ఎమ్. ఏ.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థ సంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమున్ను, 975 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారమువఱకుఁగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న్ర' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీక్రిందివెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు.

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.